## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్చైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్చైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015499

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో **భారత ప్రభుత్వపు** సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# చిట్టినీతికథలు



గ్రంథకర్త,
విద్వాన్, సాహిత్యశిరోమణి,
పంగనామల బాలకృష్ణమూర్తి, P. O. L.
మదనపల్లి కళాశాల.

ప్రకాశకులు,
త్రిలింగ గ్రంథమాల, తిరుపతి.
తిరుపతి శ్రీ పద్మావతి ముద్రాక్షరశాలయందు ముద్రితము.
1938.
సర్వస్వామ్యసంకలితము. వెల 6 అణాలు.

శ్రీరామ.

# చిట్టి నీతికథలు.

## 1. ఆతిథ్యము.

పూర్వకాలమున సక్తుప్రస్థుఁడను బ్రాహ్మణోత్తముఁ డొకఁడుండెను. ఆతఁడుంఛవృత్తిచే జీవనముఁ జేయుశపథముఁ జేసి పొలములలో రాలిన ధాన్యపుగింజల నేఱికొనివచ్చి వాని తోఁ గాలము గడప నిశ్చయించుకొనెను. ఆతని భాగ్యవశము న వసిష్ఠున కరుంధతివలె పరమసాధ్వియొకతె భార్యయయ్యెను. ఆశిష్టదంపతులు కొడుకుతోడనుఁ గోడలితోడను నావృత్తి నవలంబించి పరుల నొప్పింపక జీవించుచుండిరి. ఇట్లుండ నొకసమయమున గొప్పక్షామము దేశమందెల్లెడల వ్యాపించెను. అచ్చటచ్చట పొలములయం దతిస్వల్పధాన్యమే రాలియుండెను. ఆ యల్పధాన్యమునే సేకరించుకొనివచ్చి సక్తుప్రస్థుఁడు తన కుటుంబమునుఁ బోషించుచుండెను. చాలి యుండని యాహారముకూడ నాక్షామమువలనఁ బ్రతిదినమును లభింపమిచే వారందరు మిగులఁ గృశించియుండిరి.

ఒకనాఁడా బ్రాహ్మణుఁడెవటనో కొన్ని గోధుమగింజల నేఱికొని రాగా నాతనిభార్య యా ధాన్యముంబిండిగావించి నాలుగుభాగములుగా పంచెను. ఆకొద్దిపిండినే వారుభుజింప

వన్నద్ధులైరి. ఆసమయమున నొకయతిథి వారిముంగిటకేతెంచెను. సక్థుప్రస్థుఁడు వెంటనే యతనినిఁ దోడ్కొనివచ్చి యర్ఘ్యపాద్యాదులొసంగి యాసనమునఁ గూర్చుండబెట్టి తన భాగపుపిండి నాతనికొసంగెను, ఆ యతిథి కాకలి మిక్కుటముగనుండెను. సక్థుప్రస్థుఁ డొసంగినది చాలకపోయెను. తోడ్తోనతని భార్యయు నాపెవంతుపిండిని తన భర్తకొసంగి దాని నాయతిథికిడఁ గోరెను. కాని యాద్విజోత్తముఁడాకృశాంగినిఁజూచి 'ప్రేయసీ! ఈకొంచెమైనను నీవు భుజింపుము చాలబడలియున్నావు' అనెను. అప్పుడామె యేమిచేసెను? తనయింట నాకొన్న యతిథియుండుట సహింపనిదై తనభాగము నాతనికొసంగెను. ఆతని కదియుచాలదాయెను. అంత నాసక్థుప్రస్థుని కుమారుఁడు తనపాలి యాహారమునుఁగొని వచ్చి తండ్రికిచ్చి యతిథికొసంగఁ గోరెను. సక్థుప్రస్థుఁడు తన యనుంగుకుమారుని యాకలిబాధ తెలిసియు నాతని భాగము నాయతిథికొసంగెను. పాపము! ఆయతిథియెంతయాకలిఁగొనెనో! ఇంకను నాకలితీరదాయె. వెంటనే యాయింటి కోడలును తనయాహారమును మామగారికొసంగి యతిథికిడ వేడెను. అంతనతఁడామెను వారింప యత్నించెను కాని యా కల్యాణి, 'మహానుభావా! ఆతని సత్కరించుటవలన మీకబ్బుభాగ్యము నాకునుఁ జెంద సహింపరా! అతిథిని దేవునితోసమానముగాఁ బూజింపవలయుఁగదా! కావున నాభాగమాతనికిచ్చి నన్నును మీతోడఁ బుణ్యముఁ బంచికొననిండని

యతిదీనముగాఁ బ్రార్థింపనతఁడద్దాన నాయతిథిం దృప్తిబఱచెను

ఆయతిథియుఁ గడుపార భుజించి లేచెను. అతని చుట్టును దివ్యమైన తేజస్సు ప్రకాశించుచుండెను. వారందఱతనిని దేవుని గాఁ నెఱింగి తమ్మనుగ్రహింపవేడిరి, ఆయతిథి వేషమున నున్న భగవంతుండును వారిని కరుణావీక్షణముల ననుగ్రహించి దీవించి మాయమయ్యెను. పిమ్మట నొకముంగిస యాగృహము సొచ్చి యతిథి భుజింపగా క్రిందరాలిన సక్తురేణువులపైఁ బొరలాడెను. తత్క్షణమే దానిశరీరమర్థభాగము సువర్ణమయమయ్యెను. ఆహా! ఏమి యీవింత! త్రికరణశుద్ధితో నాచరింపబడిన యతిథి సత్కారమునందలి యుచ్ఛిష్టముపైఁ బొరలుటచే ముంగిస కర్థశరీరము బంగారువికారమాయెను. ధనకనకవస్తువాహనాదులెన్ని యొసంగిననేమి? చిత్తశుద్ధితోడ నతిథినిఁ బూజించుటతో సమానమైన దెద్దియులేదు. కావున మనమాతిథ్యప్రభావమెఱింగి చిత్తశుద్ధితో సత్కారముల నాచరింప వలయును.

కం॥ మనమున వాక్కునఁ గాయము
నను నైర్మల్యంబు తోడ నారాయణునిన్
గనుచును నాతిథ్యమిడన్
వినుతింపగరాని పదవి వేడ్కం గాంచున్ ॥

## 2. అహింస

అనేక సంవత్సరములకు పూర్వము జాజలి యను బ్రాహ్మణుఁడుండెను. అతఁడు పెక్కువత్సరము లరణ్యములలోఁ జాలకొంచెమాహారము భుజించుచు నాచ్ఛాదనమాత్రముగా కౌపీనధారియై గొప్పతపస్సుఁ జేసెను. తుదకాతఁడు తన తపముచే నహంకరించి తనంతటివాఁడు లోకమున మఱొకఁడు లేడని విఱ్ఱవీగుచుండెను.

ఒకనాడు తనలోతాను 'ఈ సచరాచర ప్రపంచమందు నన్నుఁబోలువాఁడు లేఁడు. తపస్సుచే నేనధికశక్తిని సంపాదించితిని' అని తలపోసి గర్వించుచుండెను. తత్క్షణమున నాకసము నుండి 'అట్లు గర్వోక్తులపలుకకుము. తులాధరుఁడను వర్తకుఁడొకఁడు దినమంతయు వ్యాపారమునమునిగి తేలుచునున్నవాఁడు. అతఁడు నీకంటె నెన్నియోమడంగులు సుగుణములందును, జ్ఞానమునందును గొప్పవాఁడు. అట్లయ్యు నిట్టిగర్వోక్తుల పల్కఁదగదు' అని యొక్కశబ్దము వినవచ్చెను.

అంత నా బ్రాహ్మణుఁడు తులాధరుఁ డెవ్వఁడాయని యచ్చెరువొంది బ్రాహ్మణుఁడగు తనకన్న తక్కువజాతివాఁడైన వర్తకుఁడెన్నియో రెట్లు మిన్నయనువార్త సహింపఁజాలక మిక్కిలి కోపముతోనుండెను. మఱియు నా తులాధరుఁడెట్టివాఁడో కనుఁగొనవలయునని నిశ్చయించి పయనమయ్యెను.

కొంతకాలమున కా బ్రాహ్మణుఁడు వారాణశిం జేరి యట నా తులాధరుని కనుఁగొనెను. అతఁడు తనదుకాణమునందు వ్యాపారముఁ జేయుచుండెను. జాజలి కనబడగానే తన యాసనము నుండి లేచి యాద్విజునకు నమస్కరించి యతని యా గమన కారణమునుఁగూడ తెలియపరచెను. అంతియకాక తన జ్ఞాన ప్రభావముచే నాకసమునుండి వినవచ్చిన వాక్యములును, జాజలి జీవితవృత్తాంతంబును సమగ్రముగా నుడివెను. అందులకా బ్రాహ్మణుఁడు విస్మయముఁ జెంది తులాధరా! అహర్నిశము వ్యాపారమునందు నిమగ్నుఁడవైన నీకిట్టి దివ్యజ్ఞాన మెట్లు కలిగెను? నాకుఁ దెలియఁజెప్పుము అని పలికెను,

పిమ్మట తులాధరుఁడు తనకట్టి జ్ఞాన మహింసావ్రతమును సదా యవలంబించుటచే నబ్బెనని వాక్రుచ్చెను. అతఁడు సమస్తప్రాణికోటికిని మేలేయొనరించుచుండెను. సాధ్యమైనంతవఱకు గీడుకలుగనీయకుండ చూచుచుండెను. అతఁడెవ్వరితోడ గలహింపఁడు. ఎట్టివానినేని ద్వేషింపఁడు. అట్టినడవడికయే మంచిదని పెద్దలు చెప్పిరనియు జ్ఞానప్రాప్తి కదియే మూలమనియు మనవిఁజేసెను. ఎల్లదానములకంటెనహింసయే గొప్పది. అహింసకుమించిన గొప్పధర్మము వేఱొండులేదు' అని పెక్కువిషయములా జాజలకి బోధించెను.

మఱియు తులాధరుఁడు 'యజ్ఞములకును, ఆహారమునకును పశువుల ననేకులు హింసింతురు. పశువులును మనవలె

జీవులే. వానికిని వానిబిడ్డలయందు వాత్సల్యముండును. వానికే లాటి కష్టమునిడరాదు. తెలివిలేకగుఱ్ఱములను, ఎద్దులను దుర్భరమైన భారమును మోయఁజేయుదురు. వానిని క్రూరముగా కొట్టుచు హింసించుచుందురు ఇదియా ధర్మశాస్త్రమున చెప్పినమార్గము? మన యాచార్యులు సర్వభూతములయెడ దయగలిగి యుండవలయుననికదా బోధించిరి. భూతదయయే యుత్తమమైనది. అని యనేకనిదర్శనములఁ జూపి బోధించగా జాజలి సంతుష్టుఁడై మఱికొన్ని సంశయముల తులాధరునియొద్దఁ బాపికొని నిజనివాసమునకరిగెను. అచిరకాలముననే జాజలి యు జ్ఞానముగల్గి సన్మార్గమున వర్తించుచుండెను. పిమ్మట వారిరువురును మోక్షమునుపొంది యఖండానందమనుభవించిరి.

కం॥ గురుదాన ధర్మ తపములు
వరభూతదయకును సాటివచ్చునె తలఁపన్
ధరలోవినమె 'యహింసా
పరమోధర్మ'యని పలుకు వాక్యము స్మృతులన్ ॥

## 3 శాంతము

శాంతము మహాసముద్రమువంటిది. ఏకార్యమైనఁ జేయు నపుడు కొంచెమాలోచించి మంచిచెడ్డలఁదెలిసికొని మంచికార్యములనే చేయవలయును. కోపము సాధారణముగా నందఱి కుండును. ఆకోపమువచ్చినపుడు తాఁజేయుకార్యము నెఱుగఁడు.

తానుచ్చరించు పలుకులం దెలియఁడు. తనకన్న నధికులనుగూడ దూషించును. జ్ఞానులే కోపమునణచి శాంతముగానుందురు. సాధుశీలముగలిగి శాంతముగానుండువారెప్పుడును జయమొందుదురు.

సాధువులు తమశతృవులుసహితమాచరించు నపకారములమఱచివారికి నుపకారములనే చేయుదురు. అట్లుపకారముజేయుటలోఁ బ్రత్యుపకారవాంఛయైనను వారికుండదు. శ్రీరామచంద్రుఁ డరణ్యముననున్నపుడు తమ్మునిఁబిలచి 'లక్ష్మణా! ఆయున్నత వృక్షము నెక్కి యా సైన్య మెద్దియో పరికింపుము' అనెను. లక్ష్మణుఁడును చెట్టెక్కి సైన్యముతోడ నేతెంచుచున్న భరతునిఁగని కుపితుఁడై దిగివచ్చి భరతుఁడు తమ్ముఁజంపనే తెంచుచున్నాడని శ్రీరామునితో నుడివెను అందులకాతఁడు నవ్వుచు "సోదరా! అట్టుకాదు మనతమ్ముడు భరతుఁడు మనలకపకారము జేయరాడు. నేనతనిని 'భరతా! నీరాజ్యము లక్ష్మణునికిమ్మనిన తత్క్షణమే యతఁడద్దాని కంగీకరించును. ఇందులకేమాత్రము సందియములేదు. అతఁడు చాలభక్తుఁడు. మంచివాఁడు. వానినిట్లనుమానింపరాదు. కోపమువలదు'. అని బుజ్జగింపగా లక్ష్మణునకుఁ గోపమంతయుపోయి భరతుని చాలప్రేమతో నెదుర్కొని కౌగలించుకొని యానందించెను.

పంచపాండవులలో భీముఁడుకోపముగలవాడుగదా. ఒక్కనాడతఁడు తనయన్న మొదల మిగులకోపించి 'నీవుజూదమాడుట

చే మనరాజ్యమునంతయుఁ గోల్పోయితివి. మాధనమంతయు పోగొట్టితివి మమ్ముల నడవులపాలు జేసితివి జూదరులకొసంగిన మాటప్రకారము నీప్రతిజ్ఞ నిలువబెట్టుకొనుటకై పిరికిపందవలె రాజధర్మమగు యుద్ధమునొల్లవు. అనిపలువిధముల దూషించెను అప్పుడు యుధిష్ఠిరుండు చాలదుఃఖించి కొండొకసేపు మిన్నకుండెను. ఎందులకు? తానుకోపముతో నెక్కడ మాటాడునోయని సంశయించుచు శాంతముగా 'భీమా! ప్రియసోదరా నీవుపల్కినదంతయు సత్యమే. మనకుఁగల్గిన దురదృష్టములకన్నిటికిని నేనేకారకుఁడను. కావున నీవు నాపై కోపించుట తప్పుగా భావింపను. నన్నుక్షమించి కఠినముగా మాటలాడకుము. వత్సా! నిన్నుసంతోషపెట్టుటకై నేను నాప్రతిజ్ఞఁజెడకొట్టుకొనరాదు. కొంతకాలము సహనముతోనుండుము. మంచికాలమురాగలదు. కష్టములెన్నఁడును కాపురముండవు సుమీ' అనిపలికెను అందులకు భీముఁడు మిగులసిగ్గుజెంది యన్నగారి పాదరాజీవములకు నమస్కరించి క్షమింపుమనివేడగా యుధిష్ఠిరుండు నట్లుచేసెను. అచిరకాలములోనే వారివనవాసము పూర్తియై కష్టకాలమెల్లఁ దీఱి భారతమహాయుద్ధమున విజయముగాంచి సుఖంబుండిరి. కావున శాంతమే సర్వకార్యముల సాధింప సమర్థమైనది దానికై యెల్లరును బ్రయత్నింపవలయును.

క॥ తిన్నగబల్కుము పెద్దల
మన్నింపుము వారితోడ మాఱాడకుమీ

క్రన్నన సుఖంబుచేకురు
నన్నా! శాంతంబు సూ మహత్త్వముఁగూర్చు॥

## 4. జన్మభూమి.

'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' యను పెద్దల సూక్తి చాల గొప్పది. అనగా జనని, జన్మభూమియు స్వర్గము నకన్న మిన్నయని భావము. ప్రతి మనుజుఁడును తన యూరు, తన దేశము, అని చెప్పినిట్లు జన్మభూమియందు తల్లివలె ప్రీతికలిగియుండవలయును. మహానీయులు, గొప్ప విద్వాంసులు, గొప్పచక్రవర్తులు, గొప్పశాస్త్రవేత్తలు మున్నగువారియందలి మాహాత్మ్యములకు నిధానమైన మనహిందూదేశమున జన్మించినవాఁడెవ్వఁడు తన జన్మభూమిపై యభిమానముఁగలిగి దానందు జన్మించినందుల కెంతయు ధన్యుఁడనని గర్వింపకుండును ఆర్యవిజ్ఞానమునకు తావలమైన యీ హిందూదేశము మన మాతృభూమియగుటకు మనమెంతో పుణ్యముజేసినారమని భావింపవలయును. పశుపక్ష్యాదులు సహితము వానిపుట్టింట విశ్వాసముఁజూపును. ఇందులకొక చిన్నకథను నుడివెదను.

పూర్వ మొకప్పుడు కాశీదేశమున నొక బోయవాఁడుండెను. అతఁడు విషదిగ్ధబాణములఁగైకొని మృగములఁ జంపుటకు సమీపముననున్న యరణ్యములకేగెను. ఒక చోట

నొకానొక జింకల కదుపునుఁజూచి యందొకదానిపై యొక బాణమేసెను. కాని యది గుఱితప్పి యొక గొప్ప వృక్షమునకు గ్రుచ్చికొనెను. విషదిగ్ధబాణమగుటచే నా వృక్షము శీఘ్రకాలములోనే యాకులు, కాయలు మొదలగునవియన్నియు రాలి యదియు నేలఁగూలెను. అట్టి దశయందు నా వృక్షమునందొక చిలుక వాసముచేయుచుండెను. ఆ చిలుక యా చెట్టునందేపుట్టి పెఱుగుటంజేసి యదియే తన జన్మభూమి యగుట దానిని విడువనొల్లకుండెను. అంత పక్షులభాష నెఱింగిన బ్రాహ్మణుఁడొకండు సమీపించి 'ఓచిలుకా! నీవేల యీవృక్షమెండి నేలరాలినదైనను నాశ్రయించుకొని విడువకున్నావు. పక్షులు వాసము చేయుటకు తగిన యాకులు, కాయలు, పండ్లు మొదలగునవి యేవియు నిందులేవు. పత్రపుష్పఫలనికాయ నిబిడితంబులును ప్రచ్ఛాయ విలసితంబులు మహీరుహములెన్నియో గలవు. దీనినివీడి మఱియొకదానిఁ జేరుము' అని బోధించెను.

అందులకా కీరము 'ద్విజవరా! ఈమహావృక్షమునందే నా జననీజనకులు వాసముఁజేసియుండిరి. ఇందే వారునన్నుగని యిటనే నన్నెక్కుడు గారాబముగఁ గాపాడుచుండిరి. నే నార్జించిన జ్ఞానమంతయు నిటనుండియే. నన్నీవృక్షమునుండి వెడలి మఱియొకదాని నాశ్రయింపబొమ్మని యేలయుపదేశించెదరు. పత్రపుష్పఫలభరితమై యున్నపుడు నన్నీశాఖ రక్షించి

నాజీవములఁ గాపాడినది. ఇప్పుడే నెట్లిద్దాని విడువఁగలను'? అని ప్రత్యుత్తరమిచ్చెను. అంత బ్రాహ్మణవేషముననున్న యింద్రుఁడు చాలసంతోషించి యాశుకమునొక వరము వేడుకొనుమనెను. ఆచిలుకయు నావృక్షము తిరుగ యథాపూర్వము జీవింపఁగోరగా నింద్రుండు నట్లె వరమొసంగెను. తక్షణమేఁ యెండి నేలరాలిన యాచెట్టు పునరుజ్జీవితమై యథాప్రకారము పత్రపుష్పఫలభరితంబై కన్నులపండువయగుచు నరణ్యమున కంతయు శోభం గూర్చుచుండెను.

పక్ష్యాదులకే యిట్టి యభిమానము జన్మభూమిపైఁ గలిగియుండ నిఁక మానవులమగు మనకుఁజెప్పనేల? కావున ప్రతి మనుజుఁడును దాని జన్మభూమిపై యభిమానముంచి ప్రేమించుట కర్తవ్యము.

కం॥ జననియు, జన్మభూమియు,
ననయము స్వర్గంబుకన్న నధికతరములే
యనుట, మనజన్మభూమినిఁ
గనవలె భక్తి ప్రపూర్ణగౌరవబుద్ధిన్ ॥

## 5. దయ

ఒకానొకప్పుడు రంతిదేవుఁడను పేరుగల రాజొకఁడుండెను. అతని తండ్రిపేరు సంకృతి. రంతిదేవుఁడు బీదలకెల్లఁ గావలసిన ధనమును, ఆహారమునెల్లప్పుడొసంగుచుండెను. ఆ

కారణముచే జనులందరాతని చాలమంచిరాజని శ్లాఘించుచుండిరి. అతఁడు తనకుఁగలదంతయు వాకొన్నవారికొసంగుటచే కొన్నిసమయముల నతఁడు, తనకుటుంబమువారు నుపవసింప వలసివచ్చుచుండెను.

ఒకప్పుడు రంతిదేవుఁడు తన తోడివారితో పెక్కు-దినములన్నములేక యుపవసింప వలసివచ్చెను. వారాకలిచే చాల బాధపడుచుండిరి. ఏవఁడో పుణ్యాత్ముఁడు సాధువులగు రంతిదేవాదుల స్థితిగమనించి కొంత యాహారము, పాలు, పండ్లు, నెయ్యి, కొంచెము గోధుమపిండి, మఱియు కొంచెము నీరునుఁదెచ్చియిచ్చెను. ఆకొన్నరంతిదేవుని బృందమంతయు భుజింప సంసిద్ధంబయ్యెను. అత్తరి నొకబ్రాహ్మణుఁడతిథిగా వచ్చి యాకలిగానున్నదనియు ,దనకెద్దేని కొంచెమాహారమొసంగుడనియు వారిని యాచించెను. ఆబ్రాహ్మణుఁడునుఁ గడుపారభుజించి తనదారినిఁదాఁబోయెను.

పిమ్మట రంతిదేవుఁడు మిగిలినయాహారమును తనవారికందఱకును సమముగాపంచెను. వారందఱును తమ తమ భాగమును భుజింప మొదలిడిరి తత్క్షణమే యొకశూద్రుఁడు వచ్చి తనకుంగొంచెమన్నమిడుఁడని వేడుకొనెను. రంతిదేవుఁడు తనకున్న యాహారములో కొంచెము మాత్రము శూద్రునికర్పించి వానిసంతృప్తిపఱచి పంపెను . ఇఁక చాల కొంచమే యాహారము మిగిలియుండెను, రంతిదేవుఁడు దానినే పుచ్చు

కొసఁబోగా నొక బోయవాఁడు కుక్కలతో నేతెంచి కొంచె మన్నము వేఁడెను. వెంటనే రంతిదేవుఁడు తాఁదినఁబోవుచున్న దాని నాతనికిని, కుక్కలకు నొసంగిపంపెను. తుదకా దయా శాలికొక్క గిన్నెడు నీరుమాత్రము శేషించియుండెను. రంతి దేవుఁడా గిన్నెడునీటినే పుచ్చుకొన సంసిద్ధుఁడుకాఁగా నింతలో నొక యస్పృశ్యుఁడేతెంచి 'స్వామీ! దప్పిచేఁజాల డస్సియు న్నాను. కొంచెము నీరుపోయుఁడు' అని ప్రార్థించెను. అంత నా కరుణామయుండగు రంతిదేవుఁడు, పాపము! తాఁ ద్రాగఁ బోయిన గిన్నెడు నీటినిఁగూడ నాదప్పిఁగొన్న యస్పృశ్యునికి దోసిటఁబోసి మిగుల సంతోషముతో 'నాకిఁక నాకలి దప్పులు లేవు. ఆ పరమాత్ముఁడు బీదలగువారి బాధలను, దుఃఖముల నెల్ల నేను పంచికొనునట్లుచేసి వారల సుఖవంతులఁజేయఁ జాలునట్లు నన్ననుగ్రహించుగాత! అయ్యదియే నాకు పరమా నందదాయకము' అని నుడివెను.

ఆహా చూచితిరా! రంతిదేవుని దివ్యచారిత్రము. జాతి భేదముఁ బాటింపక బ్రాహ్మణుఁడుగాని, శూద్రుఁడుగాని యస్పృశ్యుఁడుగాని మఱియెవ్వఁడైనను బాధపడుచున్నవుడా తనికి సహాయముఁజేయవలయునను సద్బుద్ధిమనలకుఁ బోధముఁ జేయుచున్నాఁడు. మన మందఱను సమానముగాఁ బ్రేమింప వలయును. ధనవంతుఁడైనను, పేదయైనను, ఏజాతివాఁడైనను, నొక్కటిగానెంచి వారెద్దియైన సాయముగోరిన యెడల వారిని

మన సోదరులవలె భావించి సహాయముచేయవలయును.

కం॥ ధనికుఁడు నిర్ధని మఱి బ్రా
హ్మణుఁడును, శూద్రుఁడును మాల యని యెంచఁగ రా
దనయము నెట్టిఁడైయైనన్
గనవలె సోదరులభంగి కలది యొసఁగుచున్ ॥

## 6. క్షమాశీలము.

మహారాజగు ధృతరాష్ట్రునకు సద్గుణసంపన్నుఁడగు విదురుఁడను సోదరుఁడుగలఁడు. అతఁడు భక్తాగ్రేసరుఁడై ధర్మాచరణమునందే యెల్లపుడును ప్రవర్తించుచుండెను. ధృతరాష్ట్రునకు దుర్మార్గుఁడైన పుత్రుఁడొకఁడుండెను. అతని పేరు దుర్యోధనుఁడు. అతఁడు తన తమ్ములైన పాండవులతోఁ గలహించుచు వారిని ద్వేషించి, వారిరాజ్యమునంతయు నపహరించి యడవులకుఁ బారఁదోలెను. అత్తఱి ధృతరాష్ట్రుండు తమ్ముఁడగు విదురునిఁ బిలిచి కర్తవ్యముఁదెలియఁజెప్పుమనెను. అందులకు విదురుఁడు, 'అన్నా! దుర్యోధనుని పాండవులతో సంధిచేసికొనుమనుము. వారల రాజ్యభాగమును తిరుగ వారలకొసంగి, తనపరివారముతోడ క్షమాపణవేడికొనుమని నుడువుమ'న ధృతరాష్ట్రుఁడు తన కుమారుని దూషించు

టచేఁ దమ్మునిపై కోపగించి, యెన్నియో యసత్యవచనములఁ బల్కి యచ్చోటువిడిచిపోయెను. విదురుఁడు మాత్రము కోపముఁబూనక పాండవుల నరణ్యమధ్యమునఁ జేరి జరిగినది చెప్పి, వారిని సన్మార్గముననే మెలగుడని బోధించుచు వారితో సుఖముగానుండెను.

కొంతకాలమునకు విదురుఁడు భవనమున లేమింగని ధృతరాష్ట్రుఁడు తనతమ్మునిపై కినుకఁబూని నందులకు విచారపడెను. తన దూతయగు సంజయునిఁబిలచి 'సంజయా! నా తమ్ముఁడు విదురుఁడెచటనైన జీవించియున్నచో వెదకి తోడ్కొనిరమ్ము. అతఁడు నాయెడ నెప్పుడును కోపగించి యెఱుఁగఁడు. నావలన నతఁడిలువిడచిపోయెనని నాకు చాల విచారముగానున్నది. పొమ్ము! తోడ్కొనిరమ్ము' అనిపనిచెను.

సంజయుఁడును పాండవులున్న యరణ్యమునకేఁగి యటపాండవులతో సుఖముగాఁ గాలక్షేపముఁ జేయుచున్న విదురునిఁ గనెను. విదురుఁడు ధృతరాష్ట్రుని యపరాధము క్షమించి తిరుగ హస్తినాపురమునకువచ్చునని యతఁడు తలఁపలేదు. అరణ్యమునను పాండవులు విదురుని చాలమర్యాదగాఁ జూచు చుండిరి. అపుడు సంజయుఁడు సమీపించి, తమ రాజగు ధృతరాష్ట్రుని క్షమించి తనతోడ తిరిగి హస్తినాపట్టణమునకు రమ్మని బతిమాలుకొనెను.

ఆతరుణమున విదురుఁడు కోపమొందెనా? పట్టణము నకు సంజయునివెంటఁబోఁ దిరస్కరించెనా? లేదు. తత్క్షణ మందేబయలుదేరి హస్తినఁజేరి, యన్నను సమీపించి 'మహా రాజా! నీవు నాకన్నవు, పెద్దవాఁడవు. నీపై నా కేలాటికోప మును లేదు. నిన్నుఁజూడవలయునని బెంగచే నిచటికివచ్చితిని. మన పాండవులు కష్టము లనుభవించుచున్నారని మాత్రము వ్యసనపడితిని. నీకుమారులును నాకుఁబ్రియులే నాకువారిపై ద్వేషములేదు.' అని వినయమునఁబల్కి తన కాతనిపై యేలాటి కినుకయు లేదని వెల్లడిపఱచెను.

అట్లే పాండవులును తమరాజ్యమునుఁబొందిన పిమ్మట ధృతరాష్ట్రునెడ ప్రవర్తించిరి. వారుమహారాజునెడ నిర్దయులై యుండిరా? లేదు. పదునైదు వత్సరములాతని యాజ్ఞను శిరసావహించిరి. ఆతని నెల్లవేళల గమనించి సదా యుప చరించుచుఁ జాల ప్రీతితో గౌరవించుచుండిరి. పాండవాగ్ర జుఁడగు యుధిష్ఠిరుఁడు తమ్ములతోఁ దామా ధృతరాష్ట్రుఁడు పుత్రవియోగముచే దుఃఖంచుచున్నందున నాతని కేలాటి దుఃఖ ముఁబొరయకుండునట్లు సంతోషముగ వారియెడ బ్రవర్తింప వలయునని చెప్పెను. తమ్ములును ధర్మరాజువచనము లాలకించి యటులే ధృతరాష్ట్రుని యెడల నెక్కుడు భక్తిశ్రద్ధలుగలిగి యుపచరించుచుండిరి. కాని భీముడు మాత్రము సహింపరాని మాటలచే రాజునెత్తిపొడుచుచునేయుండెను, ధర్మరాజాజ్ఞ

నులు వానినెల్లవేళల నివారించుచుండిరి. భీముని ప్రవర్తనచే రాజు మిగుల విసిగి రాజ్యమువీడి యరణ్యములకేఁగ బయలు దేరెను. కాని యుధిష్ఠిరుఁడు రాజును మిగుల ప్రేమించి, యడ్డపడి 'తండ్రీ! నీవడవులకేగంజనదు. పోయెదవేని నేనును వెంబడింతును. నిన్నెడబాయక యుపచరించుచు నీదుఃఖము బాపనిశ్చయించుకొంటిని. అరణ్యములకుఁబోఁదగద'ని వారించెను.

ధర్మరాజుచూపిన యాదరభావముచే ధృతరాష్ట్రుఁడాతని తన పుత్రునివలెఁ జూచుచుండెను. కావున మనమెల్లరమును మనకపకారముచేసినవారిని సహితము క్షమించి వారియెడ నేలాటిద్వేషమును లేకుండవలయును. మనసునొచ్చునట్లు మాటాడక, కోపములేక నెమ్మదిగాఁ బ్రీతిగా మాటాడవలయును.

కం॥ అపకారం బొనరించిన
నెపమెన్నక వారితోడ నెమ్మది మాటల్
కృపఁబల్కి క్షమించుటచే
నుపమింపగరాని కీర్తి నొందునెవండేన్ ॥

## 7. భ్రాతృప్రేమ I.

రామలక్ష్మణులిరువురును నన్నదమ్ములని మీకందఱకు

నుఁ దెలియునుకదా! శ్రీరాముఁ డడవుల కేఁగు నపుడతనితో లక్ష్మణుఁడు నరిగి యన్న నిదురించుచున్న సమయమున మేల్కొని కావలియుండెను. అతఁడు శ్రీరాముని మిక్కిలి ప్రేమించి యతనికిఁ గావలసిన యుపచారముల నెల్లఁ జేయుచుండెను. అన్నకు భాగమీయక యే తా నెన్నడు నెట్టి రుచ్యమైన పదార్థము నేని సేవింపఁడు. వా రరణ్యమందుండునపుడు సీతారాములకు పర్ణశాల నిర్మించి వారి నెన్నో విధముల సేవించుచుండెను,

శ్రీరాముఁడు మాయలేడిని వెంబడించి పోవుచు సీతను గమనింప లక్ష్మణుని నియోగించెను. అప్పుడతఁ డామె యెడ నెంత భక్తితో నుండెను? ఆ మాయలమారియైన రాక్షసుని కంఠధ్వనిచే మోసపోయి సీతాదేవి లక్ష్మణునితో రామునకు సహాయార్థము తత్క్షణ మరుగుమని యాజ్ఞాపింపఁగా నామె మాటమీరలేక యొంటిగ విడచి యేఁగవలసివచ్చెను,

దుష్టుఁడైన రావణుఁడు సీతనెత్తికొనిపోయినపుడామెను వెదకుటకై లక్ష్మణుఁడు శ్రీరామునితో నన్నియో ప్రదేశముల కేఁగి యాతనికి సాయపడుచుండెను. భార్యావియోగముచే క్రుంగి కృశించియున్న యన్న నోదార్చుచు లక్ష్మణుఁ డెంతయో యుపచరించుచుండెను.

శ్రీరాముఁడును తమ్మునిపై మిక్కిలి ప్రేమ కలిగియుం

డెను. ఇంద్రజిత్తుతోఁ బోరాడునపుడు లక్ష్మణుఁడు మూర్ఛిల్లగా శ్రీరామునికి దుఃఖమినుమడించెను. తమ్మునిపైఁగల ప్రేమను వెలిబుచ్చుచు 'సోదరా! పెక్కు కష్టములకోర్చి నా తోడ నరణ్యములకీవెటుల వచ్చితివో, యటుల నేనును నీతోడ పరలోకమునకువచ్చెదను. నినువిడచి నేనొక్క నిముసమైన నీభువినిఁ బ్రతుకఁజాలను.' అని సకరుణముగ విలపించెను. పిమ్మట లక్ష్మణుఁడు మూర్ఛఁదేరి సజీవుఁడుకాగా శ్రీరామునికిఁ గలిగిన సంతోషమున కంతములేదు. అపుడు తమ్మునితో 'హా! తమ్ముఁడా! దేశముకాని దేశమందైనను స్నేహితుల సంపాదించుకొనవచ్చును కాని యెచ్చటను సోదరుఁడు మాత్రము దొరకడుగా!' యని కౌగిలించికొని యానంద బాష్పముల రాల్చెను.

లక్ష్మణుఁడును తుదివఱకన్న యెడల విశ్వాసముతో నుండెను. తన జీవితముకన్న నన్నగారి కీర్తియే యెక్కుడని భావించుచుండెను. ఒకప్పుడు శ్రీరాముఁడు యమునితో నేకాంతమున సంభాషించుచు నెట్టివానినైనను లోనికి రానీయనని యు, నట్లొకవేళ నెవ్వరైనవచ్చినచో వారిని సంహరింతుననియుఁ బ్రతిజ్ఞఁజేసి ద్వారమునకడ లక్ష్మణునుంచియుండెను. అత్తఱి పరమ కోపనుండగు దుర్వాసుఁడేతెంచి శ్రీరామునిఁజూడవలయునని లోనికి పోనుంకించెను.లక్ష్మణుఁడామునీశ్వరునితో 'స్వామీ! శ్రీరాముడు రహస్యకార్యపరతంత్రుఁడై యున్నవాఁడు.

ఆతనితో మాట్లాడుటకు కొంతతడవు వేచియుండుడు. త్వరలో రాఁగలఁడు' అని వినయముగా నుడివెను. దుర్వాసుఁడు మిగుల కోపించి యిక్ష్వాకుకులంబంతయు నాశమగునట్లు శపింతు'నని పల్కెను. అందులకు లక్ష్మణుఁడు వారించి, వంశనాశనముకన్న తననాశమేవరమని యెంచి శాస్మృతిదండన పాలగుట చక్కఁగఁదెలిసియు మునిశాపమునకు వెఱచి లోనికేఁగి శ్రీరామునికి, మునివృత్తాంతంబుఁ దెలియఁజేసెను. సత్యసంధుండగు శ్రీరాముఁడును లక్ష్మణుని దండార్హునిఁ జేయ, నతఁడు సరయూనదినిఁబడి ప్రాణములఁబాసెను. అప్పుడు భ్రాతృవియోగముచే శ్రీరాముఁడు మిగుల పొగిలి యచిరకాలములో నతఁడును భూలోకమునువీడి వైకుంఠమున కేఁగి యట తమ్ములతోడను భార్యతోడను సుఖముండెను.

మనమెల్లరమును వారివలెనే మనసోదరులయెడఁ బ్రేమ నెఱపుచుండవలయును.

కం॥ అరయఁగ స్నేహితులను నెం
దరనే గాంచంగనగును ధారుణిలోనఁ
దరమా గాంచంగను సో
దరులెందును, భ్రాతృదయను, తరమెనుతింపఁ ॥

## 8. భ్రాతృప్రేమ II.

పంచపాండవులకథ మీకెల్లరకుఁ దెలియును. భీమార్జున నకులసహదేవులు నలుగురును వారియన్నయగు యుధిష్ఠిరునిఁ గౌరవముగఁ దండ్రివలె భావించుచుండిరి. దుర్యోధనుఁడు 'యుధిష్ఠిరుని పక్షముఁ జేరకుఁడని భీమార్జునాదుల బోధింపగా వారేమి ప్రత్యుత్తరమిచ్చిరి.? 'దుర్యోధనా! నీవట్లు చెప్పుట తగదు. యుధిష్ఠిరుఁడు మాకందఱకు జ్యేష్ఠుఁడు తండ్రి వంటివాఁడు. మా ప్రాణములన్నియు వానిపై నాధారపడియున్నవి మేము సోదరులమెల్లర మొక్కటియే. మమ్ము వేఱు జేయ యత్నింపకుము' అని నుడివిరి.

మఱియు దుర్యోధనుఁడు తనతండ్రినిఁ బురిగొల్పి యుధిష్ఠిరుని యడవులకేఁగునట్లు చేసినపుడాతని సోదరులతని నొంటిగనంపిరా? లేదు. వారందఱు నన్నగారితో నడవులకేఁగి వారికష్టమును పంచికొనిరి. అతనికై వారు ధనమార్జించిరి అందులకా యుధిష్ఠిరుండును వారిని మిక్కిలి ప్రీతితోఁ బ్రేమించుచుండెను.

పాండవులందరును మరణించినపిదప దేవతలు యుధిష్ఠిరునిఁ బరీక్షింపఁగోరి యాతని స్వర్గమునకుఁ దోడ్కొనిపోయి యచట వాసముఁ జేయుమనిరి. అప్పుడాతఁడేమని వారలతోఁ జెప్పెను', 'అమరులారా! మీకొకనమస్కారము. ఇటునా

సోదరులు కానరారేరే? వారెచటనున్నారో అది నరకమైనను స్వర్గమైననుసరియే వారితోడనుండగోరెద. నన్నటకు గొని పొంము' అనికదా వేడుకొనెను.

అంత నొకదేవదూత యుధిష్ఠిరుని దేదీప్యమాన తేజో విలసితంబగు స్వర్గమునుండి మిగుల భయంకరంబును కీటకా వృతంబును, గాఢాంధకార పరివృతంబునగు నరకంబునకుం గొనిపోయెను. యుధిష్ఠిరుఁడా దూత తన్నచ్చటికిఁదెచ్చుట కెంతయుఁగోపించి 'ఇదియేమిస్థలము? నన్నిటకేలదెచ్చితివి'? అని పృచ్ఛించెను. దేవదూతయు 'ఓరాజాధిరాజా! యుధిష్ఠిరా దేవతల యాజ్ఞచొప్పున నిన్నింతదనుకఁ దోడ్కొని వచ్చితిని ఈ స్థలము నచ్చనిచోఁదిరుగ నాతోడరము' అనెను యుధిష్ఠిరుండు తన తమ్ములచ్చోనుందురని తలంపఁడయ్యె. మఱియు వారచటనుండఁదగరనియే యతని నమ్మకము. తమ్ములఁగానక విచారించుచు నచ్చోటు విడచి తిరుగ దూతతోఁబో యత్నించెను. ఇంతలో 'ఓ యుధిష్ఠిరా! నిలుము, నిలుము, నిన్ను జూడ మాకత్యంతానందము గలుగుచున్నది. కొంచెముకాల మిటనుండుము. నీరాకచే మా బాధలన్నియు శమించుచున్నవి' అని దీనాలాపములు నల్దెశలనుండి వినవచ్చెను.

యుధిష్ఠిరుండును కంఠధ్వనిచే గుర్తించి 'మీరెవ్వరు? ఎచటనున్నారు'? అనెను. వెంటనే 'నేనుకర్ణుఁడ, నేను భీముఁడ, నేనర్జునుఁడ, నేనకులుఁడ, నేసహదేవుఁడ, నేభీష్ముఁడనని

సకరుణముగా నాతని చుట్టును శబ్దించెను. అంత యుధిష్ఠిరుండా దేవదూతంగాంచి 'నీవెవ్వరి దూతవో వారియొద్దకుం బొమ్ము. నేనిచట నా తమ్ముల నోదార్చుచు సుఖముగా నుండుదునని వారితో నుడువుము' అని చెప్పిపంపెను.

అప్పుడొక యాశ్చర్యము కలిగెను. గాఢాంధకారముగాను, మిగుల కఠినముగను, కీటకావృతంబుగనుండిన ఆ దేశమంతయుమారి తత్క్షణమే దివ్యసౌరభమిళితంబును, సుందమారుతయుతంబును, కడురమ్యంబునైన స్థలమాయెను. దేవతలెల్లరు మఱల కనబడిరి. యుధిష్ఠిరుండు తనకిట్లు సంభవించుటకుంగారణమేమని వారింబ్రశ్నింప నందులకు వారాతని శోధింపంబన్నిన స్వప్నమువంటి మాయయని చెప్పి వారినందఱిని స్వర్గమునకుందోడ్కొనిపోయిరి. అచ్చట నాసోదరులెల్లరు నొకటిగా కలసి సుఖముగానుండిరి.

కం॥ తెలిసికొని యాచరింపంగ
వలయుం భువి ధర్మజాది భ్రాతృప్రేమల్ ।
కలదే సుఖంబు భాగ్యం
బులున్న, సోదరుండు లేక భోగములెన్నం ॥

## 9. విధేయత. I.

పూర్వము యయాతి యను మహారాజుండెను. అతండు

పాపకృత్యములచే వ్యాధిపీడితుఁడై యకాలముననే వృద్ధుఁడయ్యెను, వెండ్రుకలు నెరయుటచేతను, ముఖమున ముడుతలు పడుటచేతనుఁ, దా నిచ్చవచ్చినరీతి మెలంగుచు సుఖమను భవింపలేకుండెను. తన దుష్కృతములకెల్లఁదానే పశ్చాత్తాపమునొందుచు చాల దుఃఖించుచుండెను. ఒక బ్రాహ్మణుఁడంత నారాజును సమీపించి యాతని దీనావస్థనెఱింగి 'మహారాజా! ఏలచింతించెదవు? నీకుమారులలో నెవ్వఁడేని నీవార్ధక్యమునుఁ బుచ్చుకొనుచో నీవాతని యౌవన మనుభవింప వచ్చును. అట్లు నీకు యౌవనమొసంగు కుమారుఁడవ్వల వేయేండ్లు తిరుగ సంపూర్ణ యౌవనమున నలరుచు శాశ్వతమైన కీర్తిని, పూర్ణాయువును, సుపుత్రావాప్తిని బడసి సుఖించును. కావున నీపుత్రులలో నెవ్వనినైన వేడుకొనుము'. అని నుడివి తనదారినిఁదాఁబోయెను.

యయాతికి నైదుగురు పుత్రులు. మొదట తన జ్యేష్ఠకుమారుఁడైన యదువును సమీపించి 'కుమారా! నాకు యౌవన మనుభవింపవలయునని కోరికగలదు. నీవు నావార్ధక్యమును వేయి సంవత్సరములవఱకుఁగైకొనుము. పిమ్మట నేను తిరుగ నీ యౌవనము నీకిత్తును. శుభము నీకుఁజేకూరు' ననగా యదువందుల కియ్యకొనక, తక్కిన పుత్రులనడుగఁ దండ్రికిఁజెప్పెను. అంత నతఁడు రెండవ కుమారుని తుర్వసువను వానినడుగఁగా నతఁడును నంగీకరింపలేదు. అటులే ద్రుహ్యువు

అణువు అను వారును తండ్రిమనోరథము నీడేర్పక తిరస్క-రించి యవిధేయులైరి.

పిమ్మట తన యనుంగు కుమారుఁడగు పురువను వానిఁజేరి వాని నట్లే పృచ్ఛించెను. వెంటనే పురువుతండ్రిపలుకులకడ్డుచెప్పక విధేయతతో 'నట్లచేసెద'నని తోడ్తోవృద్ధుఁడయ్యెను. తండ్రియుఁదత్క్షణమున యువకుఁడై విరాజిల్లెను. యయాతి నూతన యౌవనమున సుఖములనుభవించి రాజ్యము చక్కగా పాలించి యజ్ఞ యాగాదుల నాచరించి దేవతలఁదృప్తిపఱచెను. క్రమముగాఁ వేయి సంవత్సరములును గడచెను. అంత నా యయాతి పురువుఁబిలచి 'అర్భకా! నీవు నాయెడచూపిన విధేయత కెంతయు సంతసించితి. నీ యౌవనమును మఱలగైకొనుము. నేనిక వానప్రస్థాశ్రమము స్వీకరించెద' నని వాత్సల్యంబునఁ గౌగిలించుకొనెను.

మఱల యయాతి వృద్ధుఁడును, పురువుయువకుఁడునైరి మహారాజు పురువును సింహాస నాధిపునిగావింపనెంచెను. మంత్రిముఖ్యులు, పురోహితులు మున్నగు వారందఱువచ్చి 'జ్యేష్ఠునివీడి కనిష్ఠునికిఁ బట్టముఁగట్టుట న్యాయముకాద'ని వచించిరి. అందులకారాజు వారితో నిట్లుచెప్పెను. 'వినుడు, నాయాజ్ఞను నా కుమారులు క్రమముగా తిరస్కరించి పెడచెవినిఁబెట్టిరి. గాప తిరస్కరణముసేయువాఁడు పుత్త్రుఁడెట్లగును. జననీ జనకులు, పెద్దలునగువారియెడ వినయ విధేయతలఁజూపివారి క్షేమముగోరువాఁడే నిజమైన పుత్త్రుడు. జ్యేష్ఠులు నలుగురును నామాట వినరైరి. పురువొక్కఁడే

నా మాట ప్రకారము విధేయతతో నడచుచున్నవాఁడు. కావున నేను వానికే రాజ్యము నొసంగఁదలంచితిని'. అంత వారును హృష్టచిత్తులై యద్దాని కంగీకరించిరి. కావున పెద్దలు చెప్పినట్లు చేయుచు వారిని సంతుష్టపఱచినచో మనకు శుభము గలుగును.

కం॥ పెద్దలవాక్యము వినుచును
ముద్దుగ నటు చేయుచుండి మురియక యున్నన్
సిద్ధంబాయువు కీర్తియు
నద్దానంగలుగు శాశ్వతానందంబున్ ॥

## 10. విధేయత.

దశరథ మహారాజునకు శ్రీరామచంద్రుఁడు జ్యేష్ఠ పుత్త్రుఁడు. శ్రీరాముఁడనిన తండ్రికిఁ బ్రాణముతో సమానము. రామచంద్రునకు యుక్తవయసు రాగానే యతని సింహాసనారూఢుంగావించి, తానానందింపఁగోరి, మంత్రులతోఁదగు నేర్పాటులగావింప నాజ్ఞాపించెను. అత్తటి కలుషితయైన కైక తన పుత్త్రుఁడగు భరతుఁడు రాజుకావలయునను దురాశచే భర్తను రెండు వరములఁగోరెను. అవియేవన శ్రీరాముఁడు పదునాలుగేండ్లడవులకేఁగుట, భరతుఁడు పట్టాభిషిక్తుఁడగుట. ఈ వాక్యములవినగానే దశరథుఁడు రామచంద్రా! యని విల

పించి మూర్ఛిల్లెను. శ్రీరాముఁడచ్చటికేఁగి తండ్రి యవస్థఁ జూచి కైకనుఁ గారణమెఱింగింపఁగోరెను. అపుడు కైక రామునితో 'నిజముగ నీవు నీతండ్రి యాజ్ఞను నిర్వహించెద వని చెప్పినచో నేను కారణముఁ దెలిపెద'ననెను. అంత శ్రీరాముఁడు కైకతో 'జననీ! యోగ్యుఁడైన కుమారునకు తండ్రి యాజ్ఞ యనుల్లంఘనీయముకదా! నాతండ్రికై నా ప్రాణముల నైన నిత్తును. అగ్నినురుకమన్న నురికెద. సముద్రమున దుము కమన్నను దుమికెద. విషము భక్షింపుమన్నను భక్షించెదను. నిశ్చయముగ నెట్టిదైనను నాతండ్రియాజ్ఞ నెరవేర్తు. విషాద కారణమునుఁ దెలియఁజేయుము' అని వేడికొనెను.

పిమ్మట కైక తాఁగోరిన రెండు వరములను తెలియఁ జేసెను. శ్రీరాముఁడా వార్త వినినతోడనే యామెతో 'తల్లీ! అట్లే నాతండ్రియాజ్ఞ పరిపాలించెదను. నేడే యడవులకేఁ గెద'నని చెప్పి నిజజననీ సదనంబున కరుదెంచి యామెకు విన్న వింప నామె యాతని నడవులకుఁబోవారించెను. కాని విధే యుఁడైన శ్రీరాముఁడామెకెన్ని యోభంగుల తానడవులకుఁ దండ్రియాజ్ఞ నెఱవేర్పఁబోవలయుననియు, నట్లు చేయనిచో మహాపాతకము వాటిల్లుననియు నోదార్చి, తనవెంట నడవుల కే తెంచెదననగా, తండ్రిగారి యుపచారమునకై యింటనేయుం డుట శ్రేయమని నుడివి యామె యాశీస్సులఁగైకొని సీతా లక్ష్మణ సహితుఁడై యరణ్యములకేఁగెను. పదునాలుగేండ్ల

డవులలోగడపి పిమ్మట వేలకొలది వత్సరములు రాజ్యమఖండ ముగ నేలి నిర్నిద్రంబైన కీర్తిగాంచెను. పితృవాక్య పరిపాలనమున శ్రీరాము నెన్నియే మఱియొకని చెప్పవలయును. కాళిదాసుఁడను 'ఆజ్ఞా గురూణాం హ్యవిచారణీయా' యని నుడివెనుగదా. గురువులయాజ్ఞ విచారింపగాదు. వెంటనే దాని ప్రకార మాచరింప వలయుననియే దాని యర్థము. అయ్యదియే కర్తవ్యము.

కం॥ ధారుణి గురువుల యాజ్ఞల
నారయుగావలదు, దానసౌముష్వల్, దా
వారాంనిధివోలెను గం
భీరుండై యాచరింప వెసశుభదముగుఁ ॥

## 11. శరణాగత రక్షణము.

పెక్కు సంవత్సరములకు పూర్వము శిబి యను చక్రవర్తి పాలించుచుండెను. అతఁడు ప్రజలనందఱిని కడు గారాబముతో బిడ్డలవలెఁగాపాడుచుండెను. పశుపక్ష్యాదులు సహితమాతనిచేఁ బ్రీతితోఁ బోషింపఁబడుచుండెడివి. ఒక నాడా రాజు సింహాసనమునఁ గూర్చుండియున్నతఱి యొకానొక పావురము కొండొక డేగచే తఱుమఁబడుచు భీతిచే నాతని యొడిచేరి మనుజభాషణములతో తన్నురక్షింపశరణుఁజొచ్చెను. శిబియు

వల్లెయని దానిని భయముడుగునట్లు శరీరముపై నిముడుచుండ నింతలో డేగయునేతెంచి కోపముతో మనుజోత్తముల 'రాజా! నా కాహారమగు నీపావురమును రక్షించుట నీకు తగదు. నోటి ముందటికూడు తీసిన వాఁడవగుదువు. విడువుము' అనెను. మానవులమాడ్కి మాటాడుచున్న యీ రెండు పక్షులవాక్యములాలకించి యొకింత తడవు కర్తవ్యతామూఢుండై చక్కగ విచారించి శరణుఁజొచ్చిన పావురమును రక్షింప నిశ్చయించి డేగతో 'ఈ పావురమునకు బదులు నీకు కావలసిన మాంసాశనము వేఱొండిచ్చెదను. పావురమును తప్ప మరెద్ది యేనొసంగెద, కోరుకొనుము.' అనగా నా డేగయు నాతని శరీరము నుండి యా పావురమంత తూనికగల మాంసమును గోరెను. శిబి యందులకొప్పుకొనెను. వెంటనే యొక త్రాసుఁదెప్పించి యొక తట్టలో నాపావురమునునిచి, మఱొకట నిజమాంసముఁ గోసియుంచెను. పావురమున్నతట్ట వ్రాలియుండెను. క్రమముగా తనమాంసమునంతయు నాతట్టలో వేయుచుండెను. తట్టలు రెండును సమముగావయ్యె. అంత నాతడే యాతట్టయందుఁ గూర్చుండెను. క్షణమే తట్టలు సరిగా తూగెను.

అత్తటి యామాయడేగ యదృశ్యమయ్యె. పావురము రక్షింపఁబడియె. శిబియు నాశ్చర్యపడి నా పావురవృత్తాంతమడుగ నది యిట్లు చెప్పందొడంగె. 'ఓమహారాజా! నేనగ్ని దేవుఁడ నా డేగ దేవేంద్రుఁడు. మేము మీ రాజధర్మమును

శరణాగత రక్షణమును పరీక్షింపఁ గోరి యీ వేషములఁదాల్చి యిటు కావించితిమి. నిజముగ నీవు చాలమహనీయుఁడవు. నీ ధర్మమువలనను నార్తులరక్షించితివి. నీ గాయములన్నియు నచిరకాలముననే మాని నీకు దివ్యశరీరము గలుగుగాత. శాశ్వతమైన కీర్తియు, ధీరోదాత్తులగు పుత్రులును గలుగుగాక' యని దీవించి యంతర్ధానమయ్యెను. శిబియు నపరిమితానందభరితుఁడై సుఖంబుగ రాజ్యమేలి శాశ్వత కీర్తిం గడించెను. కావున మనమును శరణుఁజొచ్చినవారిని రక్షింపవలయును, అదియే గొప్పధర్మము.

కం॥ ధరణిన్ ధర్మములన్నిట
శరణాగతరక్షణంబు సారపుధర్మం
బరయన్, దానికి సమమా
గురుధర్మంబొండు లేదు గురుసూక్తులలోన్ ॥

## 12. సహనము I.

చాలకాలమునకుమున్ను కుశికుఁడను రాజొకఁడుండెను. చ్యవనుఁడను మహర్షి, క్షత్రియకులంబువలన బ్రాహ్మణులకుఁ జేటువాటిల్లునని తెలిసి, తత్కులంబు నాశంబుఁగావింప నెంచి కుశికునిఁజూడవచ్చెను. రాజదంపతులెద్దేని దోషముఁ గావించినంగాని వారినేమియుఁ జేయ శక్యము గాకుండెను.

అందుకై వారియెడ నేడియైన నేరము మోపి శపింప నెంచి రాజమందిరముఁ జొచ్చెను.

చ్యవనుఁడు రాఁగానే రాజు తనభార్యతో నెదురునడచి సగౌరవముగా నా మహర్షినిఁ దోడ్కొనివచ్చి 'స్వామీ! మేమిరువురమును మీదాసులము. మీసేవఁజేయ సంసిద్ధులము మారాజ్యమైనను మీకుంగావలయునేని గైకొందు. మీకేమి కావలయునో సెలవిండు' అని వేడిరి. చ్యవనుండును వారితో 'రాజదంపతులారా! నేనొక వ్రతముంబూనెద. మీరాజ్యమును, భాగ్యమును నాకువలదు. మీరిరువురును నావ్రతకాలమున నాకుపచారము సేయుచుండవలయును'. అని చెప్పెను. అంతులకు వారత్యంతము హర్షించి 'వల్లె' యని యామునిపుంగవుని రాజభవనమునకుంగొంపోయి యొక రమ్యమగు స్థలముంజూపి యటవిశ్రమింపఁగోరిరి. కాని యాముని యాకలిగానున్నదని తెలుపగా వారాతనికిరుచ్యంబులైన యాహారములను, పానీయములనుఁ గొనివచ్చి సమర్పింప నాతఁడును భుజించెను.

పిమ్మట 'నిద్రపోవలయు'నని వచించి యటనున్న నొక పాన్పుపై పరుండగా నారాజదంపతులు మునీశ్వరుసమీపము నఁగూర్చుండిరి. చ్యవనుఁడు వారితోఁదన్ను మేల్కొలుప రాదనియు తాను నిద్రనుండిలేచునత్యంతము వేచియుండి పాదసంవాహనంబాచరింప వలయుననియు నాజ్ఞాపించెను.

దంపతులు మునివాక్యముల చొప్పున రాత్రియంతయు మేల్కాంచి యుపచరించుచుండిరి. వేకువయైనను నిద్రమే ల్కొనక యాచ్యవనమహర్షి యిరువదియొక్కదివసంబులు వరుసగా నొక ప్రక్కకైనను చలింపక నిదురించెను. అంత నతండు మేల్కాంచి వారితో నేమియు మాటా డక భవనంబునుండి వెలికినడచెను. కుశికుఁడు, తన భార్యయు క్షుత్పిపాసాపీడితులయ్యు నామునీశ్వరుని వెంబడింప, కొంత సేపటికాతఁడు తనయోగప్రభావంబున నదృశ్యుండయ్యెను.

అంత నా దంపతులు చాల విచారముతో మహర్షి నల్లెడల వెదకుచు, నెందునుఁగానక, తదాయత్తచిత్తులై తిరుగ రాజభవనముం జేరిరి. అచ్చోతొల్లింటివలె, నా ఋషిసత్తముఁడు మఱొక ప్రక్కకు మఱలి పాన్పుపై శయనించియుండెను. మఱల నాదంపతులాతనికి పాదముఁలొత్తుచు మేల్కొని వేచి యుండిరి. మఱి యిరువదియొక్క దినముల కామహర్షి నిద్ర నుండి మేల్కొని 'నేను స్నానముఁ జేయవలయు, నాకు తల యంటుడని యాజ్ఞాపింపగనే వారతఁడు కోరినట్లు చాలసేపు సుగంధితైలములచే నభ్యంజనముగావించి స్నానగృహమునకుఁ దోడ్కొనిపోవ నటనాతఁడు తిరుగ మాయమయ్యెను. కుశి కుఁడును తన భార్యతో ఋషిని వెదకుచురాగా నాతఁడు రాజసింహాసనముపైఁ గూర్చుండియుండెను. అంత వారాతనికి దివ్యములైన యాహారములఁగొనివచ్చి సమర్పించిరి. వాని

నెల్ల నాతఁడు దహించి నాశనముఁజేసి రాజునకుఁ గోపముఁ గల్గింపయత్నించెను. కాని కుశికుఁడేమాత్రమును చలింపక యాతని రేయింబవళ్ళు సేవఁజేయుచుండెను.

కం॥ సహనము పాపౌఘవిపిన
దహన సమర్థంబగు ఘన దావానలమౌ।
నిహితము శుభమద్ధామౌ।
సహనమె ప్రతిదానికిలను, నరులకు హితమౌ॥

## 13. సహనము II.

పిమ్మట నాచ్యవనుఁడు రాజుతో 'కుశికా! నేఁగోరిన చోటికి నన్నొకరథమునఁ గూర్చుండఁబెట్టి నీవును నీభార్యయు నీడ్చుకొనిపోవలయు' ననగా కుశికుండు 'చిత్తము టులేయొనర్చెద' మని యొకగొప్పరథమునుఁదెచ్చి యందాతని నుపవిష్టుంజేసి తానొకప్రక్కను, భార్యయొక ప్రక్కను రథంబునకు కట్టుకొని చ్యవనునికి తమ్ముఁదోల నొక తీక్ష్ణాగ్రమైన యంకుశమునందిచ్చెను.

అంత చ్యవనుఁడు 'మీరు తిన్నగా రథమును లాగవలయును. నాకేమాత్రమాయాసము కలుగరాదు. మీ ప్రజలందఱు మీరు రథము నీడ్చుచుండఁజూడవలయును. నేను వారల కందఱకును రత్నములను ధనమును నా యిష్టప్రకా

రము దానముఁ జేయవలయును. నెమ్మదిగా రథముపోనిండు' అనెను. వెంటనే యారాజు తన భృత్యులనంపి కోశాగార మందలి ధనమంతయుఁ దెచ్చి మహర్షి వశముఁ జేయ నాజ్ఞాపించెను. రాజదంపతులు రథమును లాగుచుండిరి. ప్రజలును, ప్రధానులును తమ రాజునకు సంభవించిన దశకై ఖిన్నులై రథము వెంట నడచుచుండిరి.

చ్యవనుఁడా దంపతుల సంకుశముతో పొడుచుచుఁ దోలుచుండెనుగాని శరీరములందు గాయములయి, వానినుండి రక్తము స్రవించుచున్నను, క్షుత్పిపాసలచేతను శ్రమచేతను చాల బాధపడుచుండియు వారా మహర్షికి సేవఁజేయుట కేమాత్రము వెనుతీయక యతిసహనముతో రథము నీడ్చుచుండిరి. అప్పటికా చ్యవనుఁడు కరుణించి రథంబునిలిపి డిగ్గి, రాజదంపతుల రథబంధములనుండి విముక్తులఁ జేసి చిఱునగవుతో 'దంపతులారా! మీరు చాల గొప్ప గుణముగలవారు. మీ సహనశీలమునకు మెచ్చి నేనొక వరముసంగెద' నని యనుగ్రహించుచు వారిమేనులెల్ల నిమురఁగా గాయములు మాని ఆకలియు శ్రమమునులేక యథాపూర్వముండిరి. వారిని మఱునాఁడు తన్నుఁ జూడుడని యాజ్ఞాపించిపంపెను. ఆ రాజదంపతులును దేదీప్యమాన తేజోవిరాజితులై భువి నవతరించిన యమరులోయనఁ బ్రజలచే ననుమానింపఁబడుచుండిరి. అందఱును వారినిఁగని చాల సంతోషించుచుండిరి.

మఱియు నాఁడా రాజదంపతులు పూర్వమా మహర్షి నిడించిన స్థలమునకు రాగా నచ్చట దివ్యములైన భవనంబులును, రమ్యములైన పుష్ప ఫలములును మున్నగు రమణీయ వస్తుజాలమంతయుఁ గనవచ్చెను. శ్రవణపేయము లగు గానామృతమున విలసిల్లు గీతములును, వైదిక మంత్రములును వినవచ్చెను. అది యంతయు కలయో మాయయో యని వితర్కించుచు, నిజముగ దేవలోకమా యనియు సంశయించుచుచుండఁ జ్యవనుఁడు పాదసూపి తత్క్షణమే యదృశ్యుఁడయ్యెను. తోడ్తోనా రమణీయ వస్తుప్రపంచమంతయు మటుమాయమాయెను. కుశికుఁడద్దాని కేమేని చెడుతలంచెనా? లేదు తనకట్టి దివ్యదృష్టి నొసంగిన మహానీయుని చ్యవనుని మనమున నత్యంతము ధ్యానించుచుండెను.

పిమ్మట చ్యవనుఁడు ప్రత్యక్షమైవారి పరీక్షాసమయము ముగిసెననియు వారి సహనశీలముచే క్షత్రియ కులమునుఁ గాపాడుకొనిరనియు, వారు సందర్శించిన దివ్యస్థలము స్వర్గమేయనియు, వానినిఁ గనఁజాలిన దివ్యదృష్టి వారికిఁ గానుకగా నొసంగఁబడెననియు దయార్ద్రతుఁడై నుడివెను, అంత నా దంపతులు మహర్షి పాదారవిందములకు మ్రొక్కిరి. చ్యవనుఁడును వారినాశీర్వదింప, వారు వారి నెలవుల కేగిరి. కుశికుఁడు చ్యవనానుగ్రహీతుఁడై తొల్లింటికంటె నధిక తేజస్సత్వశాలియై చక్కగ రాజ్యంబునేలుచుండెను. కావున మనమును

మిగుల సహనము గలిగియుండవలయును. అజ్ఞాన పాతకములు నశించును. శుభంబొనఁగూడును.

కం॥ క్షమయను సహనము దానన్
సమకూరున్ సర్వసిద్ధి సాధులకిలలో
విమలంబగు సుజ్ఞానము
ప్రమోదమున్ సంఘటిల్లు క్రమముగ దానన్ ॥

## 14. నమ్రత - శ్రీకృష్ణుడు.

ధర్మరాజొకప్పుడు గొప్ప యాగము నొక దానినిఁ గావింప యత్నించెను. ఆతని సోదరులు, స్నేహితులు, మంత్రిముఖ్యులు మున్నగువారందఱును సమీపించి కర్తవ్యములఁ గూర్చి ముచ్చటించుచుండిరి. ఆసమయమున జగన్నాయకుఁడైన శ్రీకృష్ణుఁడు స్వయముగ నేతెంచెను. ధర్మజుఁడతని నతి గౌరవమున నాతిథ్యపూజల సలిపి సంప్రీతుఁ జేసి యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టెను. అత్తరి ప్రజలందఱును మిగుల సంతోషించిరి. యుధిష్ఠిరుండును యాగముఁ జేయ శ్రీకృష్ణుని యనుజ్ఞ గోరెను. ఆ పరంధాముఁడును యాగమవశ్య కర్తవ్యమని నుడివి యనుజ్ఞనొసంగెను.

బహుపరాక్రమోపేతులైన భీమార్జునాది సోదరులును,

ప్రధానామాత్యులును, శీఘ్రకాలముననే యాగమునకువలయు వస్తుజాలము సిద్ధముఁజేసిరి. దేశదేశములకును బ్రాహ్మణులను క్షత్రియులను, వైశ్యులను, శూద్రులను యాగమునకతిథులుగ నాహ్వానింప ననేక చారులనంపిరి. ఆ దూతలు నతి కాలంబున దేశమంతయు ధర్మరాజాధ్వరముంగూర్చి వెల్లడిజేసి యందఱ నాహ్వానించిరి.

ధర్మజుని యాగమునకై వేలకొలంది బ్రాహ్మణులును, నానాదేశములనుండి రాజన్యులును వైశ్యులును శూద్రులును విచ్చేసిరి. అప్పుడచ్చోటఁజేరిన ప్రజా సముదాయమునందెల్ల శ్రీకృష్ణుఁడే మహనీయుఁడు. అతనికెనయని చెప్పఁగఁదగిన వారెవ్వరును లేరు. . అట్టి సర్వాధికుండును, జగన్నియామకుండును, పూజ్యుఁడునగు శ్రీకృష్ణుఁడే స్వయముగ తన నమ్ర స్వభావమును వెలిఁబుచ్చెను. ధర్మజునియధ్వరమున కేతెంచిన బ్రాహ్మణోత్తములనెల్ల చక్కఁగఁ బూజించి స్వయముగ శ్రీకృష్ణుఁడే వారిపాదరాజీవములఁ బ్రక్షాళనముఁగావించి యా పవిత్రోదకము తన శిరంబుపైఁజల్లుకొనెను. ఆహా! ఏమి నమ్రత! పరమాత్మయైన శ్రీకృష్ణుఁడే యటుచేసెనన, నది మనకొఱకే. మనమెల్లరము నాతనివలె సేవఁజేయ నమకట్టవలయునని బోధించుచున్నాఁడు. పరులకు సేవఁజేయుటయే పరమోద్దేశముగా భావించి యహంకార మమకారములవీడి నడచుకొనవలయును. 'పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడన'

మ్మను సూక్తి యెంతయు స్మరణీయము. పరులకుపకారము చేయుటచేఁ బుణ్యంబును, పీడించుటచేఁ బాపంబును సంభవించును. కావున నెల్లప్పుడును పరోపకారమునకే పాటుపడవలయును. చూడుఁడు! మన కందఱకు పత్రములను, పువ్వములను, ఫలములను, ప్రచ్ఛాయల నొసంగి యనేక భంగుల వృక్షములు మేలుసేయుచున్నవి. అటులే మేఘములును మనలకు జీవనమొసఁగి గ్రీష్మసంతప్తజీవాళికి నూత్న మాన్వి యానందింపఁజేయుచున్నవి. అచేతనములే యిటు పరోపకారము క్రియారూపమున బోధించుచుండ నిక మనమేల యాచరింపకుండుట! పరోపకారము మహనీయుల సహజగుణము. చంద్రుఁడేమని ప్రత్యుపకారము గోరియా లోకమునకంతయు నానందమొదవు వెన్నెలనొసంగుచున్నాఁడు. అది యతని స్వభావము. మనమెల్లరము సదా పరోపకారమునకై యత్నింపవలయును.

క౦॥ పరపీడనమునఁ బాపము
కరంబు పుణ్యము పరోపకారమునఁ జే
కురునని పెద్దలునుడువుదు
రరయఁ బరోపకృతి సహజమగు నార్యులకున్ ।

## 15. గురుభక్తి - ఉపమన్యువు.

పూర్వము ధౌమ్యుఁడను మహర్షి యనేకమంది శిష్యు

లకువిద్యగఅపుచు ప్రఖ్యాతివడసెను. ఉపమన్యువను వటు వొకఁడు ధౌమ్యునాశ్రయించి కదుభక్తితో గురుమూర్తినే దైవముగా భావించి శుశ్రూషలాచరించుచుండెను.

ఒకనాడు ధౌమ్యుఁడు శిష్యుని భక్తి భావము పరిశీలింపనెంచి యాతని బిలచి 'ఉపమన్యూ! నీవింక మధుకరవృత్తిని జీవింపుము.' అని యాజ్ఞ చేసెను. శిష్యుండును 'చిత్తము'ని నాటనుండి యాగ్రామమున ద్విజోత్తముల గృహములయందు మధుకరవృత్తిసల్పుచు కాలము గడపుచుండెను. నానాటికి నుపమన్యువు బలియుచుండెను. గురువతనింజూచి 'యుపమన్యూ! నీవిక నేకభుక్తముగ కాలముగడపుము. శరీరము స్థూలమగుచున్నది' యనెను. నాటనుండి యాఛాత్రుడొక మధ్యాహ్నసమయములందుమాత్రము భుజించుచుండెను. అట్లాచరించినను నుపమన్యువెంటిమాత్రము కృశింపలేదు. అదికాంచి ధౌమ్యుఁడాతని నా యేకభుక్తముఁగూడమాని యాలమందలఁ దోలుకొనివచ్చుపనికి నియోగించెను. అతఁడును తద్వృత్తిశవలంబించి గోక్షీరము సేవించుచుండెను. క్షీరపానమున నుపమన్యువు మిపుల పుష్టినొంది విభక్తఘనగాత్రుండును, పీవరుండునయ్యెను. గురువర్యుఁడాతని పీవరునిగా తిలకించి, నాటనుండి క్షీరపానముగూడ వారించెను. అందులకాయంతేవాసి 'ప్రసాదము'ని యా మందలతోలికొని వచ్చుచు దేహధారణమునకై దూడలు త్రాగగా నేలఁబడిన ఫేనమును మాత్రము

భుజించుచుండెను. దాన నతఁడత్యంత పీనుండాయెను. ధౌమ్యుఁ డదియుఁగాంచి ఫేనభోజనము పీనత్వహేతువుగా నెఱింగి దానిని సైతము నివారించెను. ఉపమన్యువు గురువాక్యమును శిరసా వహించి యట్లే నడచుకొనుచు క్షుద్బాధ నర్కక్షీర పానమున వారించుకొనుచుండెను. కొన్నిదినములకే యతి దారుణము నంజేసి యాతనికి కన్నులుపోయి యంధుడయ్యెను. అట్లయ్యు తనవృత్తిని మానకుండెను. ఒకనాడుపమన్యువు గోవులఁ దోలికొనివచ్చుచుండ నంధత్వమున త్రోవగానక యొకపాడు బావిలోపడెను. గోవులుక్రమముగా నిల్లుఁజేరెనుగాని యుపమన్యువు రాడాయెను. అంత నాగురువు శిష్యవత్సలుఁడగుటఁ జేసి యుపమన్యువును వెదక బయలుదేరి 'ఉపమన్యూ! నీ వెచ్చటనున్నావు' అని బిగ్గఱగా నఱచుచుండెను. సమీపమున నంధుఁడైన యాశిష్యుఁడు యెలుఁగు తన గురుమూర్తిదిగా నెఱింగి తత్క్షణమే, 'స్వామీ! గ్రుడ్డివాఁడనై యీ పాడు బావినిఁ బడియున్నాను.' అని బదులుపల్కెను. ధౌమ్యుండా పలుకులవిని యటకేతెంచి శిష్యుని యవస్థకుచింతిల్లి, యాతని నిష్కళంకభక్తికిమెచ్చి, యొక స్తోత్రమును పఠింపనుపదేశించెను. ఉపమన్యువు నట్లాచరింప వెంటనే దేవవైద్యులగు నశ్వినీ దేవతలు ప్రత్యక్షమై యుపమన్యువును వరముగోరికొన గోరిరి. అశ్వినులుపమన్యువు తనకు నేత్రముల నొసంగ వేఁడుకొనునని తలంచిరి. కాని గురుభక్తి పరాయణుఁడగు నతఁడు తొలుత వారలకు నమస్కరించి, 'యశ్వినీ దేవతలారా! నా

నేత్రములటుండనిందు, మా గురువులకొక దంతము లేదు. దానిని వారికొసంగుడు.' అని కోరెను. అందులకా దేవతలాతని గురుభక్తికి మెచ్చి యటులే చేసి పిమ్మట నుపమన్యువునకును దివ్యదృష్టినొసంగి యాశీర్వదించి యదృశ్యులైరి. చూపురాగానే యుపమన్యు వా బావినుండి పైకివచ్చి గురుమూర్తికి ప్రణమిల్లి 'స్వామీ! మీ యనుగ్రహము' అనెను. ధౌమ్యుండు నాతని గుణగణములకు సంతుష్టాంతరంగుండై తన గృహమునకుం దోడ్కొనిపోయి సకల విద్యల నేర్పి వానిని మహానీయునిం జేసెను.

ఆహా! చూచితిరా! గురుమూర్తి కరుణ, గురుభక్తి ఫలితము. పైకి కఠినములుగానున్నను గురువుల యాజ్ఞల మేరకు నడచికొనిన ననేక మేళ్ళు కలుగును. గురువులు శిష్యుల మేలుకొఱకే యిట్లు శాసించుచుందురు. కొండ్రాచువలె పైకి క్రూరముగానున్నను వారికి మనస్సుమాత్రము దయారసోపేతమే. కావున గురువుల వాక్యముల శిరసావహించి నడచుకొనవలయును.

క౦॥ కరుణామయ గురుమూర్తుల
చరణాబ్జములన్ భజింప - శాంతముతోడన్
శరణాగత శిష్యులకున్
దరుణమెఱిఁగి శుభముఁగూర్తు రెపుడు గురువుల్ ॥

## 16. నీచబుద్ధి.

చాలకాలమునకు పూర్వమొక్కముని వరేణ్యుఁడు నిరుపమంబగు తపంబాచరించి శాంతస్వభావమే మూర్తీభవించెనా యున్నట్లుండెను. ఆతని యాశ్రమంబున నరణ్యమందలి ఘాతుక మృగములెల్ల నన్యోన్య వైరముంజాలించి స్నేహమున మెలఁగుచు సుఖముగా వసించుచుండెను. ఆ జంతువులలో నొక కుక్క మిక్కిలి భక్తిగలిగి యా మునీశ్వరు నాశ్రయించి సమీపముననే మెలఁగుచుండెను. ఒకనాడొక దుప్పి యేలొకో యాకుక్కపై వైరముంబూని కఱవవచ్చెను. అంత నాకుక్క భయపడి ముని చెంతకుఁబఱువిడెను. ఆతఁడు తన తపశ్శక్తిచే నా శునకమునొక బలిష్ఠమైన దుప్పిగాఁజేసెను. కఱవవచ్చిన దుప్పి భయపడి పఱుగెత్తెను. కొంతకాలమునకొక బెబ్బులి వచ్చి మునిచెంతనున్న దుప్పిని బెదరింప, నా ఋషి దానినిఁ గూడనొక శార్దూలముఁగావింప, నా బెబ్బులినిఁ గెలిచి సుఖముండెను. వెంటనే యొక మదపుటేనుగా మునియొద్ద శార్దూలమును హింసింపరాగా నా సంయమి యద్దానిని మఱొక మత్తకరిగాఁజేసి తిరుగ జయము గలుగఁజేసెను. ఆ మత్తకరి యటు సంచరించుచుండ నొక సింహముంజూచి బెదరి రోఁగి చెంతకఱుదేర నతఁడద్దానిని మరియొక సింహముగ జేయ భీతిలేక సగర్వముగఁదిరుగాడుచుండెను. మఱొకనాడు శరభమొందు సింహముంగలియఁడాసెను. అంత నదిభయపడి మునిసమీప

మున కేఁగెను. అతఁడద్దానిని తిరుగ నొక శరభముంగావించి నిర్భయముగ విహరింపఁజేసెను. అట్లు శరభరూపముఁదాల్చి స్వేచ్ఛమై యడవిం దిరుగుచు నితర జంతువుల కెల్ల భయంకర మై వర్తించుచుండెను.

అంత నా శరభరూపమున నున్న గ్రామసింహము సహజముగు నీచబుద్ధిని 'ఆహా! ఏమి యీ మునియొక్క నేర్పు. నేను భయపడినపుడెల్ల తత్తమచితరీతి నన్ను మార్చి భయము నీగించెను. ఇతర మృగములకును నీతడిట్లు చేయునుగాబోలు. అపుడు నా స్వేచ్ఛకు భంగము కలుగును. ఈ మునిని సంహరించినచో నేనీరూపమున నేయుండవచ్చునుగదా!' అని తలపోయుచుండెను. త్రికాలజ్ఞుఁడగు నా ఋషిసత్తముఁడు తనదివ్య బోధముచే నీ శ్వానమాలోచించుచుండిన దంతయు నెఱింగి 'ఈ నీచజాతియందుత్పన్నమైన కుక్కకునున్నత పదవి నొసంగ తగదు. కావున తొల్లింటి యట్లుండుయ్యది శరభరూపమువీడి కుక్కయేయగుఁగాక' యనగానే తత్క్షణమది కుక్కయయ్యె. కావున నీచకులమునఁబుట్టినవారికి నీచబుద్ధియేయుండును. అధికారమునకు తగినవారిని విచారించి నియోగింపవలయును. నీచబుద్ధిని విడనాడవలయును.

కం॥ శునమగు శరభాకారము
శునకంబునకొసఁగి మాని-శుభమొనగూర్చ

తన నీచబుద్ధి నొల్లక
మునీశ్వరున వంచనెంచె - మూఢతనకటా ॥

## 17. సత్యము I.

పూర్వము రంగఁడను చోరుఁడొకఁడుండెను. అతఁడు చౌర్యమున చాలమేటియై, ఘోరకృత్యముల సల్పుచు తన జీవితముగడుపుచుండెను. పట్టణమున కనతిదూరంబున నరణ్య మధ్యమున నెలవు కల్పించికొని రాత్రిళ్ళు పట్టణమున దొంగి లించుచుండెను. పగలంతయు తప్పద్రావి రాత్రియటు చౌర్యము చేయుట యతని దినచర్యగా నుండెను. ఒకనాడొక సాధుపుంగవుఁడాయూరికి కేతెంచెను. జనులందఱు నతని సమీపించి యాతని యుపదేశముంబొంది నిష్కల్మషులై కాలము సత్కార్యములచేఁ గడపుచుసుఖమనుభవించుచుండిరి. దొంగరంగఁడు నా సాధువునుఁ జూచినంతనే యాతని డాసి 'స్వామీ! అతిపాపాత్ముఁడ, నన్నుఁదరింపఁజేయుఁడ'ని సాష్టాంగ ప్రణామంబాచరించి వేడుకొనెను.

అంత సర్వజ్ఞుఁడగు నాసాధువు రంగని నిజవృత్తాంత మంతయు నెఱిఁగింపుమన, నతఁడు వంచనలేక యథార్థముగ, త్రాగుట, హింసించుట, అసత్యమాడుట మున్నగువానిచేనగు తన దిన చర్యను తెలియఁబఱచుచునవియే తనకు ధనార్జనము

నకు సాధనములనియునుడివెను. ఆసాధు వాతని సాధనములలో నొక్కటి తనకు గురుదక్షిణగా నీయఁగోరెను. రంగడువల్లె యన నాసాధువు రంగని 'యసత్యముపల్కుట' యను దానిని తనకు దక్షిణగాఁ గైకొనెను. గురువునకసత్యము నర్పించుటచే నాటఁగోలె సత్యమునే పల్కుచు చౌర్యము నాచరించుచుండెను. యథా ప్రకారము రంగఁడు చౌర్యము సాగించుచుండ నాతని పట్టుకొనగల మేటి భటుండొక్కండును లేడాయె. అత్తఱి నా యూరి రాజే స్వయముగ చోరవేషముఁబూని రహస్యముగ నిలువెడలి వీథులయందు దొంగను వెదకుచు తిరుగాడుచుండెను. కొంతసేపటికి రంగఁడు తన చౌర్యసాధనములగు కత్తి, గడ్డపార, పగ్గములు మున్నగునవిగొని వచ్చుచుండెను. దొంగవేషముననున్న నా రాజు రంగనిఁగాంచి కలసికొని 'నీవెవరు? నీ తావెద్ది? ఈ యాయుధములేల?' యని యడిగెను. రంగఁడును 'అయ్యా! నేనొక దొంగను. నావృత్తి చౌర్యము. నేనీ సమీపమున నరణ్యముననుందును. నా పేరు రంగఁడు' అని నుడివెను. ఆమాటలవినఁగానే రాజరంగని సామాన్యునిగానెన్నక పరీక్షింపఁగోరి తానొక దొంగనని చెప్పి రంగని నా రాజభవనంబుననే చౌర్యముచేయఁ దోడ్కొని పోయెను. రాజసౌధమున కావలివాండ్రందఱును తూగుచు నిద్రించుచుండిరి. రంగనికాతఁడు బొక్కసముంజూపి యాధనమపహరించి యిరువురును పంచికొనునట్లు కట్టడిచేసికొనిరి. రంగఁడందులకంగీకరించి గదిలోనికేఁగి యటనున్న ధనరాసు

లంజూచి యాశ్చర్యపడి యెద్దియు నపహరింపవీలులేక గదినం తయు శోధించుచుండ నొక దంతపుపేటికయం దమూల్యము లైన మెఱుగురత్నములు కనుల మిరుమిట్లుగొలుపు కాంతుల తోఁగనవచ్చెను. కట్టడిఁజేసికొన్న ప్రకారము వారికామైన రత్నములు పంపు కుదురమిచే నాతఁడొక దానిని మాత్రమా పేటికయందు రెండవవాఁడు చూచుచుండగనే యుంచి నాలుగు రత్నములమాత్రము వెలికిదెచ్చి యిఱువురును సమముగ పంచి కొని యెవరి త్రోవను వారేగిరి.

## 18. సత్యము II.

రాజువెంటనే తన దొంగవేషమునువీడి యథా ప్రకారము రాజమందిరముననుండెను. మఱునాడుదయమున కావలి వారు బొక్కసమున గడచినరాత్రి దొంగతనము జరిగెనని నివేదించిరి. ఆ ప్రభువుకూడ నేమియు నెఱుఁగనివానివోలె చౌర్యమునకెంతయు విచారపడి యా దొంగను కనుఁగొన చారులఁబంపెను. నిపుణులగు కొందఱారంగని చోరునిగ నెఱింగి బంధించి రాజుకడకుఁదెచ్చిరి.

రంగఁడు భయమించుకయులేక రాజునకు కట్టెదుట నిలుచుండెను. భటులాతని బెదరించుచుండిరి. రాజు దొంగనుఁ జూచి 'ఈ బొక్కసమున దొంగిలించినదినీవేనా? ఏమి దొంగ

లించితివి? అధనమెందు దాచితివి?' అని గంభీరముగా ప్రశ్నిం
చెను. అందులకు రంగఁడు తన మ్రోలనున్న రాజే తనతో
చౌర్యమున నాయపడినవానినిగా నెఱుఁగనేరక 'మహారాజా!
నేను దొంగలించినది సత్యము. నాతో నొకఁడు కలసి నిన్న
రాత్రి సన్నిమందిరమునకుఁ దోడ్కొనివచ్చి యీ పనికి ప్రేరే
చెను. మేమిరువురము నిందలి కనకరాసులను, రజతరాసు
లంజూచి దొంగలింపనేరక యొకదంతపుపేటికలో నైదు దివ్య
రత్నములుండ నందు నొక దానినిమాత్రె మాపేటికయందే
యుంచి నాల్గింటిని మేమిరువురమును సమముగా భాగించు
కొని మాదారిని మేము పోయితిమి. ఇదంతయు యథార్థము'
అని చెప్పెను. రాజు తనలో తాను మిగుల సంతోషించి,
యథార్థమరయని వానివలె యైదవరత్నమందున్న సంగతి విచా
రింప తన మంత్రిని నియోగించెను. కాని దుర్బుద్ధియగుటచే
నామంత్రి యొక సేవకునిఁబంపి యా యైదవ రత్నమును రహ
స్యముగ తన యింటఁజేర్పఁబంపి యిట రాజుకడ రంగని క్రూర
వీక్షణములఁ జూపుచు 'మహారాజా! ఐదవరత్నము లేదు. దొంగ
యొన్నఁడేని సత్యముపల్కునా! ఈతఁడొక గజదొంగగా కను
పించుచున్నాడు. ఈతని శిక్షింపక యూరక విడువరాదు.

కాని యథార్థమెఱింగిన రాజు తనసేవకుని రహస్య
ముగ మంత్రి యింటికేఁగి యటరత్నమెద్దేనియున్నచోఁ గొని
తెమ్మని పంపెను. ఆభటుఁడును వెంటనే మంత్రిగృహమున

మఱొకనిచే నుంచబడిన రత్నముంగొని రాజును సమీపించి సభాసదులందఱు చూచుచుండ నా రత్నము మంత్రియింట నుండెనని చెప్పెను.

గుణజ్ఞుండైన యా రాజు తత్క్షణమే తన మంత్రిని యా పదవినుండి తొలంగించెను. రంగని సత్యశీలమునకు మెచ్చి యచ్చెరువొంది యిట్లు సత్యముపల్క కారణము తెలుపఁ గోరెను. అతఁడును తానొక్క సాధువునకు నసత్యమును గురు దక్షిణగా నొసంగుటచే నది తనది కామి దానిని స్మరింపనైనఁ దగదని నాటనుండి సత్యమునే పలుకుచుండెననియు నుడివెను. ఆపల్కులకెంతయు సంతసించి రంగనికి వెంటనే తన మంత్రి పదవినిచ్చి సుఖముగ నుండఁగోరెను. అప్పుడా రంగఁడు 'మహారాజా! నేనొక్క యసత్యమును వదలుటచేతనే యీ మంత్రిపదవి లభించె. ఇక దుర్గుణములన్నియు వదలిన నెట్టి యున్నతస్థితి లభించునో'యని వితర్కించి తన మంత్రి కృత్యముల చక్కఁగ నెరవేర్చుచుండెను. కాని మనము నందు తన గురువునే ధ్యానించుచుండెను.

కొంతకాలమున కాసాధువుకూడ నాపట్టణమున శిష్యుల నరయఁగోరి యేతెంచెను. రంగఁడా వృత్తాంతమెఱింగి తత్క్షణమాగురుని సన్నిధిఁజేరి ప్రణమిల్లి 'స్వామీ! మీదాసుఁడ కరుణింపుడు. మీ యనుగ్రహమున నే మంత్రినైతి. మారాజు

కూడ తమ ధర్మవార్థము వేచియున్నారని గ్రక్కనున్న రాజుఁ జూపెను. ఆరాజును మహానీయునికిఁ మ్రొక్కి యుపదేశ మర్థించెను. ఆ యోగీశ్వరుఁడును నారాజునకును మంత్రికిని సదుపదేశములఁగావించి యాశీర్వదించిపంప వారును సుఖముగా కాలము గడపుచుండిరి. చూచితిరా! సత్యము నిలుపుట వలని ఫలము. సర్వశుభములును సత్యముననే సిద్ధించును. కావుననే పెద్దలు 'సత్యాన్నాస్తిపరోధర్మః' అని ధర్మముల న్నిట సత్యమునకే యగ్రస్థానమొసంగిరి.

కం॥ సత్యము ధర్మములన్నిట
సత్యుత్తమమనియు నుడువునఖిలస్మృతులున్
నిత్యమనుష్ఠించినచో
సత్యంత ముదంబుకల్గుసంప్రార్యులిలన్ ॥

---

## 19. మహానీయుల మహిమము.

పూర్వమిక్ష్వాకు కులంబునఁ బరీక్షిత్తను రాజుండెను. అతనికి నలువురు పుత్రులుండిరి. చిరకాలము వేదోక్త విధుల నాచరించుచు, ధర్మమున రాజ్యమేలి తుదకు తన జ్యేష్ఠ కుమారునికి శలుఁడను వానికిఁబట్టముఁగట్టి తపశ్చర్యకై తాన డవులకేఁగెను.

మహారాజైన శలుఁడును తండ్రివలె ధర్మమార్గమున

నే రాజ్యమేలుచుండెను. ఒక్కనాఁడాతఁడు రథారూఢుఁడై మృగయావినోదార్థము చెంతనున్న యరణ్యమునకేఁగ నట నొక కృష్ణసారమును చాలదూరము తఱుముకొనిపోయెను కాని యది కనుఁబడలేదు. అంత సారథి శలునితో 'ఆయుష్మన్త! ఇట కనతిదూరంబుననే వామదేవమహర్షి యాశ్రమముగలదు. వారు మహాతపస్సంపన్నులు, మహనీయులు. వారియొద్ద వాయువేగముగల యశ్వములుగలవు. వాని సహాయమున మనమీ కృష్ణసారమునుఁ బడయఁగలము' ని విన్నవించెను. శలుఁడు వెంటనే యా వామదేవు నాశ్రమమునకేఁగి మునిపుంగవునిడాసి భక్తిమై యతని పాదములకెఱగి, తన కృత్యముఁ దెలిపి వామ్యాశ్వముల నర్థించెను. అందులకా తాపసి 'ఆయుష్మంత! నీ కోరినట్లు నా గుఱ్ఱముల నిచ్చెదను. నీకృత్యము దీననెఱవేఱఁగలదు. నీపనియైన పిమ్మట నాగుఱ్ఱముల మగుడఁ జేర్చుము' అని నుడివెను. శలుఁడును వల్లెయని యాగుఱ్ఱములతో నా జింకను వెన్నాడి సంహరించి తన పట్టణమున కేఁగెను.

ఒకమాసము గడచెను. శలమహారాజు వామదేవుని యశ్వముల నతనికిఁ జేర్పఁడాయె. వామదేవుండు తన శిష్యుని శలునొద్దకుఁబంపి యశ్వములఁ దెమ్మనెను. కాని శలునిచే నవమానితుఁడై యా ఛాత్రుడు తిరిగివచ్చి గురునకా వృత్తాంతము మనవిఁజేసెను. అంత వామదేవుఁడు క్రుద్ధుండై స్వీయ

ముగ రాజమందిరమున కేఁగి యారాజును తన గుఱ్ఱములఁదన
కిమ్మనెను. శలుఁడంత నామునితో 'వామదేవా! క్షత్రియ
యోగ్యంబులైన తురంగంబులు బ్రాహ్మణులకేల? మీకుఁ
దగిన వృషభములను, ధేనువులను వేలకొలంది యొసంగెదఁ
గైకొనుము. నీ యశ్వముల యాశ నుడుగుము. వానిని నీకీ
యఁజాలను' అనెను. వామదేవుఁడు తామ్రమూర్తుండై శపింప
నుద్యుక్తుఁడుకాగా శలుండాతని బాణములచేఁజంప విల్లెక్కు-
పెట్టి యొక బాణమేయ యత్నించెను. ఆ మహర్షి ప్రభావ
ముచే నాబాణము శలునికుమారునికిఁదగిలెను. మఱల నొక
బాణముచే శలుఁడు వామదేవుఁజంపఁబూనె. కాని యాముని
మహిమచే నారాజునకు బాహువుస్థంభించెను. ఎటనుండియో
యనేక యోధులరుదెంచి శలునిఁజక్కడంచి మాయమైరి.

అంత శలునిభార్య పరమపతివ్రత మునికడకేతెంచి
ప్రణమిల్లి వేడుకొనెను. వామదేవుండును కృపాతరంగితాంతః
కరణుండై యామె కొక వరమొసంగెను. ఆసాధ్వియు తన
కుమారుని పునరుజ్జీవితుఁజేయఁగోరఁగా మునియట్లచేసి గుఱ్ఱ
ములఁగొని నిజాశ్రమంబునకరిగెను. కంటిరే, వామదేవుని
మహాత్తు. తపశ్శక్తికి మించిన శక్తిలేదు. ఎట్టి యసాధ్యము
లైన కార్యములనైన తపముచే సాధింప శక్యమగును. మహ
నీయుల కదియే గొప్పధనము. కావుననే వారిని తపోధను
లందురు. నిగ్రహానుగ్రహశక్తి సంపన్నులగు మహనీయులతో

నెన్నండును విరోధింపరాదు. వారియెడ భక్తిశ్రద్ధలఁజూపుచు విధేయులమై మెలంగవలయును.

కం॥ ఉరగంబులవోలె భయం
కరులగుచుఁ గురువులుండ్రు-కాపురుషులకున్
సరసుల్ ద్రాక్షా దీక్షా
గురువులునై మించుచుండ్రు-గుణవంతులకున్ ॥

## 20. అతి సర్వత్ర వర్జయేత్.

పూర్వము ప్రహ్లాద పౌత్రుఁడు బలిచక్రవర్తి ముల్లోకముల కధిపతియై దేవతలకెల్ల భయముం గూర్చుచుండెను. భీతులైన దివౌకసులు విష్ణుమూర్తిని శరణుఁజొచ్చిరి. అంత నా శ్రీమహావిష్ణువు వామనావతారముం బూని బలిచక్రవర్తి చెంతకేఁగి మూఁడడుగులమేర స్థలము తనకుఁ దానమొసంగఁ గోరెను. దానముచేయుటయందు బలి కడు ప్రసిద్ధుఁడు. తన గురువులైన శుక్రాచార్యులు యాచనకువచ్చిన వటువు శ్రీమహావిష్ణువేయనియు, మోసమునఁ దన్నుఁ గెలువవచ్చెననియు రానున్న కీడుఁ దెల్పినను, మితిమీరి గుర్వాజ్ఞవిడక, విష్ణువే స్వయముగ యాచకుఁడైనపుడు తా దాతయగుటకంటె మఱొక యుత్కృష్టకార్యము లోకమున లేదని యెంచి యెద్దియడిగినను దానముఁజేయుట కొడంబడియె.

అంత నామాయా వటువు రెండులోకములను రెండు పాదప్రక్షేపణములచే నాక్రమించి మూడవపాదమునకు తావు లేమి నా బలిని మూడవ పాదముంప స్థలముంజూపఁగోరెను. అప్పటికిని బలివెనుదీయలేదు. మితిమించి దానముఁజేయ నొడంబడినందులకు శిరమువంచి దానిపై నిడగోరెను. విష్ణుమూర్తియునట్లుజేసి బలినణగఁద్రొక్కి దేవతల సంతసించెను. 'అతి'కిపోవుటచేగదా బలి యధోగతిపాలాయె.

రావణాసురుని మనకందఱకును తెలియునుగదా. అతనికి లౌల్యమెక్కుడు. అతడు శివునిగూర్చి ఘోరతపముఁజేసి యనేక వరములఁబడసి స్వర్గములోకమున దేవతలను నానా బాధలఁబెట్టి యటనున్న దివ్యాంగనలనందఱు బందీలఁజేసి తన యంతఃపురముననుంచెను. వారందఱును చాలక, రావణుఁడతి లౌల్యమున శ్రీరామచంద్రుని భార్యయైన సీతాదేవినిఁగూడ మాయలఁబన్ని యపహరించెను. అట్లుచేసి యేమి యనుభవించెను. తుదకు శ్రీరామునిచే నిహతుఁడాయెను.

అట్లే దుర్యోధనుండు మిక్కిలి యభిమానియై, తన మానమునకు మితిలేక తనంతటివారును, తన్నుమించినవారు నొరులుండరాదని యెల్లపుడును తన సౌఖ్యమునే గమనించుచు సహోదరులును రాజ్యార్హులునగు పాండవుల కపకారముఁ జేయుచుండెను. జగన్నాయకుఁడైన శ్రీకృష్ణుఁడును, వృద్ధుఁ

లైన భీష్మ ద్రోణాదులు నెన్నియోమార్లు చెప్పినను పాండవులకుఁ గీడుఁ జేయ మానఁడాయెను. వారి రాజ్యమును వాఁకీయమన్న నీయఁడు. తన సౌఖ్యమునకు భంగమెన్నఁడును రాఁగూడదని యత్యంతముఁ గోరుచుండెను. బంధువులు, తమ్ములు, నాప్తులు, మున్నగువారెల్ల నశించినను అతిమానముగల దుర్యోధనుఁడు పాండవులతోఁ గలియఁడాయె తుదకాతని గతియేమయ్యె. తనవారెవ్వరును లేక యొంటిగఁ జిక్కి సంహారింపఁబడియె. కావున 'అతి' నన్నింట విడువవలయును.

కం॥ అతిదానంబున బలియును
నతిమానంబున సుయోధనావనినాథుం
డతి లౌల్యంబున రావణుఁ
డతి కష్టములొందుకతన నతి విడువవలెన్ ।

శ్రీ పద్మావతి ముద్రాక్షరశాల తిరుపతి;—1938.